రాయిగారులు మొదలగువారు చూపిన
శాసనసభా వ్యామోహము విద్యావంతుల
వ్యామోహమునకు నిదర్శనము. ఆరంభము
నుండియును గల శాసనసభా వ్యామోహము
విద్యావంతులందు తిరిగి విజృంభించుట
బ్రిటిషు ప్రభుత్వ సంస్కారఫలము. రాంచి
యందు కాంగ్రెసుస్వరాజ్యపక్షము డాక్టరు
అన్సారిగారి యాధిపత్యముక్రిందను నిర్ణయిం
చిన శాసనసభాప్రవేశ నిర్ణయమును గాంధి
మహాత్ము డాశీర్వదించుట మహాత్ముని ధర్మ
నిర్వహణ కనుకూలముగ నున్నది. సత్యా
గ్రహమసిధారావ్రతము. ఆసురసంపత్పరాయ
ణమైన ప్రపంచమున కసిధారావ్రతమైన
సత్యాగ్రహము దురారాధ్యము. సత్యాగ్రహ
మునకు త్రికరణశుద్ధిగను సత్యాహింసా
రాధనము బీజము. సత్యాహింసాధారములేని
సత్యాగ్రహము స్వరాజ్యసిద్ధికి నిరాధార
మగుటయేకాకను సత్యాగ్రహమునకే కళం
కమును గలుగజేయుచున్నవిధమును దేశపరి
స్థితులు వెల్లడిచేసినవి. ప్రభుత్వ మవలం
బించిన నిర్బంధవిధానము కాంగ్రెసువ్యవహార
నిర్వహణమును దుర్లభముచేసినది. ఇట్టి
విషమపరిస్థితులందు గాంధిమహాత్ముడు సత్యా
గ్రహమ్మునకు ప్రస్తుతము స్వస్తిని జెప్పుట
యును, శాసనసభాప్రవేశము నాశీర్వదించుట
యును మహాత్ముని సత్యాగ్రహశీలమున కను
రూపముగ నున్నవి.

* * * *

**పాట్నాసమావేశము**

పాట్నాయందుగూడిన అ. భా. కాంగ్రె
సుసంఘము గాంధిమహాత్ముడు నిర్ణయించి
నటులు సత్యాగ్రహవిరామమును, శాసన
సభాప్రవేశమును నామోదించి గాంధిమహా
త్ముని సత్యాగ్రహనాయకత్వమును సార్థకము
చేసినది. నాయకులుచేసిన యుపన్యాసము
లన్నియును సత్యాగ్రహవిరామమును నభి
లషించుచు గాంధిమహాత్ముడును సత్యా
గ్రహమునకు స్వస్తిని జెప్పవలయునని సర్దే
శించినవి. సత్యాగ్రహజనకుడైన గాంధిమహా
త్మునిసయితము సత్యాగ్రహమును విరమింప
మనికోరుట యనుచితము. స్వరాజ్యసంపాదన
మునకుగాంధిమహాత్ముడు నిర్ణయించిన సమష్టి
శాసనోల్లంఘనమును, వ్యష్టిశాసనోల్లంఘన
మును స్వరాజ్యసిద్ధికి నిరుపయోగములైనను
సత్యాగ్రహప్రతిష్ఠకును, గాంధిమహాత్ముని
మహత్త్వమునకును సాధనములైనవి. దైవబల
సంపదాశ్రయము లైన అహింసాసత్యప్రభావ
ములు గాంధిమహాత్ముని నాయకత్వమునను
ప్రపంచమునకు సువ్యక్తము లైనవి. గతించిన
పదేండ్లయందును కాంగ్రెసునం దేర్పడిన
భేదాభిప్రాయము లంతరించుట కవకాశము
లేర్పడినవి. శాసనసభలయందు స్వరాజ్య
సిద్ధికి విశ్వాసము కలవారును, లేనివారును
దేశక్షేమమునకు కలిసి పనిజేయుట కవకాశ
ములు గలిగినవి. శాసనసభలకు ప్రత్యేక
స్వరాజ్యపక్షము గాకను కాంగ్రెసుపక్షమె

అభ్యర్థులను బంపవలయునని పాట్నాయందు చేసిన నిర్ణయము కాంగ్రెసుసంయోగమునకు వినియోగపడుచున్నది. పాట్నానిర్ణయములు వివిధపక్షనాయకులకును, ప్రజలకును, కాంగ్రెసు ప్రచారకులకును, ప్రభుత్వమునకును కాంగ్రెసుప్రతిష్ఠను రక్షించుట కవకాశములను సమకూర్చినది. లబ్ధావకాశములను ప్రభుత్వాధికారులును, ప్రజానాయకులును సార్థకము చేయుట శ్రేయస్కరము.

* * * *

కాంగ్రెసు ప్రతిష్ఠ

కాంగ్రెసుప్రతిష్ఠను కాపాడుటకు గాంధిమహాత్మునివలెను నితరులును పాటుపడుట పరమార్థము. గాంధిమహాత్ముడు సత్యాగ్రహప్రస్థానమును విరమించి మూడువారములు గతించినను ప్రభుత్వాధికారులు మీనమేషములను గుణించుచు నూరకుండుట యన్యాయము. సర్ సామ్యుయలు హోరుగారు హిందూస్తానప్రజలు స్వరాజ్యము నభిలషించుట న్యాయమని తెలుపుచు సాధనములను కల్పింపకుండుటయును, ఆటంకములను తొలగింపకుండుటయును నసంగతము. హోరుగారిమాటలు కొంతవరకైనను క్రియారూపమును దాల్చుట ప్రయోజనకరము. విల్లింగ్డను ప్రభువు తలపెట్టిన నిర్బంధ విధానము విజయమును పొందినది. వారు సంకల్పించిన సంస్కరణవిధానము జాతీయప్రభుత్వావరణములం దెంతవరకు సఫలమగునదియును కాలము నిర్ణయింపవలసి యున్నది. విదేశప్రభుత్వమున కాధారములైన దానదండనోపాయములను ప్రతిఘటించవలసిన భారము ప్రజానాయకులమీదను గలదు. హిందూ మహమ్మదీయ విభేదములను, బ్రాహ్మణబ్రాహ్మణేతర భేదములను, లిబరలు కాంగ్రెసుపక్ష భేదములను శాసనసభాబహిష్కారప్రవేశపక్షభేదములను విడిచి, కాంగ్రెసుప్రతిష్ఠను కాపాడుట దేశక్షేమపరాయణములైన పాట్నా నిర్ణయములకు ఫలము. వివిధపక్షములవారును సంకుచితములైన స్వపక్షప్రయోజనములను విడిచి విశాలమైన కాంగ్రెసుప్రయోజనముల నారాధించుట ప్రజానాయకులకు కర్తవ్యము. కాంగ్రెసు విజయమే స్వపక్షవిజయముగను, ప్రజావిజయముగను, స్వరాజ్యవిజయముగను భావించి ప్రజానాయకులు స్వధర్మనిర్వహణమునకు దీక్షను బూనుట వివేకము, పరమార్థము. అభ్యర్థుల నిర్ణయమునందును కాంగ్రెసు దీక్షాపరాయణులైన అభ్యర్థులను మాత్రమే నిర్ణయించుటయును, రక్షించుటయును దేశక్షేమపరాయణులకు కర్తవ్యము. బొంబయియందు గూడనున్న కాంగ్రెసు మహాసభ కధ్యక్షపదవి నధిష్ఠించుటకు

సత్యాగ్రహదీక్షా పరాయణుడైన శ్రీయుత బాబురాజేంద్రప్రసాదుగారు సకలవిధములను తగియున్నారు. ఉత్కళ కాంగ్రెసు మహాసభకు బాబురాజేంద్రప్రసాదుగా రధ్యక్షులుగ నెన్నుకొనబడినను కారణాంతరముల వలనను వా రధ్యక్షతను నిర్వహించుట కవకాశములు గలుగలేదు. ఇతరనాయకులును, గాంధిమహాత్ముడును ప్రస్తుతము గలిగిన యవకాశములను రాజేంద్రప్రసాదు గారికి సంక్రమింపజేయుట్ల విధ్యుక్తముగ నున్నది. గాంధిమహాత్ముడు సత్యాగ్రహమును ప్రస్తుతముపసంహారమును జేసినను గతించినపదేండ్లయందును గాంధిమహాత్ముని నాయకత్వము క్రిందను సత్యాగ్రహము ప్రజానాయకుల హృదయములం గలుగజేసిన ఆత్మగౌరవ విశ్వాసములకును, దైవబలసంపదారాధనమునకును ప్రపంచేతిహాసములందు మహాపర్వముగను వెలయగలదు.



Printed and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.